ఓమ్

# శ్రీ షోడశగౌరీ తదియనోము కథ

(స్వర్ణగౌరీ పూజ)



బ్ర॥ శ్రీ రాళ్లబండి పాండురంగశర్మ
క్షీరసాగరము
శ్రీ గాయత్రి దేవాలయము
సికింద్రాబాద్

# శ్రీ షోడశ గౌరీ తదియ నోము కథ

తదియ గౌరీ నోముపూజ

ఆచమనమ్............ కేశవాయస్వాహా .................శ్రీకృష్ణాయనమః................ నామాలు చదువ వలెను, ప్రణవము చేసి.............సంకల్పము........

శుభాభ్యుదయార్థంచ, శుభేశోభనే మంగళే ముహూర్తె అత్రపృథివ్యాం జంబూద్వీపే, భరతవర్షే, భరత ఖండే, మేరో దక్షిణ దిగ్భాగే, శ్రీశైల స్యాత్ , వాయవ్య ప్రదేశే, శ్రీకృష్ణా గోదావర్యోర్ , మధ్యదేశే సమస్తదేవతా బ్రాహ్మణ హరిహర సన్నిధౌలక్ష్మీ నివాస గృహే ..... అస్మిన్ వర్తమాన వ్యవహారిక..... చాంద్రమాన...... సంవత్సరే దక్షిణాయనే వర్షఋుతౌ భాద్రపదమాసే శుక్లపక్షే, తృతీయాం..... వాసరే , శుభవాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణ, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం....... శుభతిథౌ, శ్రీమాన్ ...... గోత్రోర్భవస్య ...... నామధేయస్య. ధర్మపత్నీ ....... నామ్నీం యావత్ జీవ పర్యంతం సౌమంగల్య సిద్యర్థం, పుత్ర పౌత్రాభి సంపతౌ భాగ్య సిద్యర్థం షోడశ గౌరీ పూజాం కరిష్యే.

కలశ పూజా శ్లో॥ గంగేచయమునేచైవా గోదావరి సరస్వతీ, నర్మదేసింధు కావేరీ జలేస్మిన్ సన్నిదింకురు. శ్రీ గణాధిపతిపూజ, చేయవలెను

## శ్రీ తదియ గౌరీ లఘు పూజా

ధ్యానమ్

శ్లో ॥ దేవీం షోడశ వర్షీయాం శశత్ సుస్థిర యౌవనామ్ ।
బింబోష్టిం సుదతీ శుద్ధాంశరత్పద్మ నిభాననామ్ ।
శ్వేత చంపక వర్ణాభాం సునీలోత్పల లోచ నామ్ ।
జగద్దాత్రీంచ దాత్రీంచ సర్వేభ్యః సర్వసంపదామ్
సంసార సాగరే ఘోరే జ్యోతీ రూపాం సదాభజే॥

శ్రీ షోడష గౌరీ దేవతా మైనమః ధ్యానం సమర్పయామి
శ్రీ షోడశ గౌరీ ............. ఆవాహనం సమర్పయామి
శ్రీ షోడశ ............. రత్నసింహ్మాసనం సమర్పయామి
శ్రీ షోడశ ............. పాదయో పాద్యం సమర్పయామి
శ్రీ షోడశ ............. హస్తయో రఘ్యం సమర్పయామి
శ్రీ షోడశ ............. ముఖే ఆచమనం సమర్పయామి
శ్రీ షోడశ ............. ఉపచారిక స్నానం సమర్పయామి
శ్రీ షోడశ ............. పంచామృత స్నానం సమర్పయామి
శ్రీ షోడశ .............శుద్ధోదక స్నానం సమర్పయామి
శ్రీ షోడశ ............. శుద్ధ ఆచమనం సమర్పయామి
శ్రీ షోడశ ............. వస్త్రాం సమర్పయామి
శ్రీ షోడశ ............. యజ్ఞోప వీతం సమర్పయామి
శ్రీ షోడశ ............. దివ్య చందన గంధం సమర్పయామి
శ్రీ షోడశ ............. హరిద్ర. కుంకుమ, సుగంధ ద్రవ్యాణి సమర్పయామి

## అథాంగపూజ

గౌరీ దేవతాయనమః పాదౌపూజయామి.
పార్వత్యైనమః గుల్ఫౌపూజయామి.
అంబికాయనమః జంఘే పూజయామి.
చండికాయనమః జానునీ పూజయామి.
దుర్గాయనమః ఊరూ. పూజయామి.
కాత్యాయన్యైనమః కటిం పూజయామి.
గాయత్రైనమః కుక్షిం పూజయామి
మహాలక్ష్మ్యైనమః ఉదరం పూజయామి.
సావిత్ర్యైనమః వక్షస్థలం పూజయామి.
పద్మహస్తాయనమః బాహూంపూజయామి.
సరస్వత్యైనమః కంఠంపూజయామి.
అన్నపూర్ణేశ్వర్యైనమః వక్రంపూజయామి.
బ్రహ్మవిష్ణు శివాత్మికాయనమః దంతాంపూజయామి.
భక్తరక్షిణ్యైనమః నాసికాం పూజయామి.
లలితాంబికాయనమః నేత్రాణి పూజయామి
సువర్ణ స్వరూపిణ్యై నమః శిరః పూజయామి.
శ్రీ షోడశ తదియ స్వర్ణగౌరీ దేవతాయనమః సర్వాణ్యంగాని పూజయామి.

# శ్రీ గౌర్య ష్టోత్తర శతనామావళిః

ప్రతి నామానికి మొదట, ఓం అని.......... చివర. నమః అని చదివిన, ఫలముకల్గును.

ఓం గౌర్యై నమః గణేశజనన్యై నమః గిరిరాజ తనూ భవాయనమః గుహాంబికాయనమః జగన్మాత్రే నమః గంగాధర కుటుంబిన్యైనమః వీరభద్ర ప్రసువేనమః కష్టదారిద్ర్య శమన్యై నమః శివాయ నమః శాంభవేనమః శంకర్యై నమః బాలాయ్యైనమః భవాన్యైనమః భద్రదాయిన్యైనమః మాంగల్యదాయిన్యై నమః సర్వమంగళాయ్యై నమః మంజుభాషిణ్యై నమః మహేశ్వర్యైనమః మహిమాయైనమః మంత్రా రాధ్యాయై నమః మహాబలాయై నమః హేమాద్రిజాయైనమః హేమవత్యైనమః పార్వత్యైనమః పాపనాశిన్యైనమః నారాయణాంశజాయై నమః నిత్యాయై నమః నిరీశాయైనమః నిర్మలాయై నమః అంబికాయై నమః మృడాన్యైనమః ముని సంసే వ్యాయైనమః మానిన్యైనమః మేన కాత్మ జాయైనమః కుమార్యైనమః కనకాయైనమః దుర్గాయైనమః కలిదోష నిషూదిన్యై నమః కాత్యాయన్యైనమః కృపా పూర్ణాయైనమః కల్యాణ్యైనమః కమలార్చితా యైనమః సత్యైనమః సత్త్వమయ్యైనమః సత్యాయైనమః సౌభాగ్యదాయైనమః సరస్వత్యైనమః అమలాయై నమః అమర సంసేవ్యాయై నమః అన్నపూర్ణాయైనమః అమరేశ్వర్యైనమః అఖిలాగమ సంస్తుతాయైనమః సుఖసచ్చిత్సుధారసాయైనమః భాహ్యారాధితభూత దాయైనమః భానుకోటి సముద్యుతయేనమః హిరణ్మయ్యైనమః పరాయైనమః సూక్ష్మాయైనమః శీతాంశు కృతశేఖరాయైనమః హరిద్రా కుంకుమా రాధ్యాయై నమః సర్వకాల సుమంగల్యైనమః సర్వభోగప్రదాయైనమః సామ శిఖాయైనమః వేదాంత లక్షణాయైనమః

(2) ఓం కర్మ బ్రహ్మమయైనమః కామకలనాయైనమః కాంక్షితార్థప్రదాయైనమః చంద్రార్కాయుత తాటంకాయైనమః చిదంబర శరీరిణ్యై నమః శ్రీచక్రవాసిన్యై నమః దేవ్యైనమః కామేశ్వర పత్న్యైనమః మార్కండేయ వరప్రదాయై నమః పుత్రపౌత్ర వర ప్రదాయైనమః పుణ్యాయైనమః పురుషార్థప్రదాన్యైనమః సత్యధర్మ రతాయైనమః సర్వసాక్షిణ్యైనమః సంశాంత రూపిణ్యై నమః స్యామలాయైనమః బగళాయైనమః చండిన్యైనమః మాతృకాయైనమః భగమాలిన్యైనమః విరజాయైనమః స్వధాయైనమః దాక్షాయణ్యైనమః దీక్షాయైనమః సర్వవస్తూత్తమోత్తమాయైనమః శివాభిధాయైనమః శ్రీవిద్యాయైనమః ప్రణవార్థ స్వరూపిణ్యైనమః హ్రీంకార్యైనమః త్రిపురాయైనమః త్రిగుణాంబికాయైనమః సుందర్యైనమః మహాగౌర్యైనమః షోడశాక్షరదేవతాయైనమః శ్రీషోడశ గౌరీ దేవతా యైనమః ॥

అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి

జగన్మాత్రేనమః

# శ్రీషోడశ స్వర్ణగౌరీ పూజా

# తదియగౌరీనోము కథ.

పూర్వము భరతఖండమున అవంతి దేశాన్ని ప్రద్యుమ్న మహారాజు పాలనలో ఉండెను. తనరాజ్యమును నాలుగు పాదాల న్యాయముతో ఏలుచుండెను. సువర్ణాదేవిని వివాహమాడెను. ఎంతో కాలము గడిచినా సంతానము పొందలేదు.

ఇహపర సుఖాల పొందగోరిన మహారాజుగారు సౌభాగ్యదేవి అను రాచకన్యను పెండ్లియాడెను. చిన్నరాణి వల్లపుత్రవంతుడాయెను. అమేయే సర్వస్వమని తలచాడు.

పెదభార్య సువర్ణాదేవిని గొడ్రాలుగా ముద్రవేసి ఊరిచివర పూరిల్లు వేయించి అందులో ఉంచెను. ఆహారమునకై ముక్కి పైయిన సోలెడు బియ్యం, జొన్నలు, ఆకుకూరలు పంపుచుండెను.

చిన్నరాణి ప్రేమలో మునిగి పోయెను. ఇంతలో భాద్రపద శుక్ల తదియ వచ్చెను. ఆ రోజు ప్రతి గృహములో శ్రీషోడశ గౌరీ వ్రతము అను తదియ గౌరీ నోము ఆచరిస్తారు. ఆ శుభ దినంబున గౌరిదేవి స్వయంగా రాజుగారి పత్నుల పరీక్షించ దలచెను.

అంతః పురంలోని కెళ్ళి కురూపిగా తలవిప్పుకొని పేళ్లూ, ఊసుకళ్లు ముక్కునీళ్లూ చిరిగిన గుడ్డలు చూడ అసహ్యము వేసె రీతిలో చిన్నగాణిని చేరి అమ్మా ఈ రోజు శ్రీషోడశ స్వర్ణగౌరీ దేవి వ్రతము, ప్రతి స్త్రీలు నోచుకోతగిన పవిత్ర సౌభాగ్య తదియ నోము. నేను బ్రాహ్మణురాలను వచ్చాను నాకు నలుగు పెట్టి స్నానము పోసి, కోక కట్టనిచ్చి, నాతో నోమించికుని చేతికి మెడకు తోరము, దండవేయించు కోవలెను. వాయన భోజనము పెట్టి దక్షిణ తాంబూలము నిచ్చి దీవెన పొందవలెను. ఆ ముత్తైదువును సాగనంపిన సుఖసంతోషాలు కలుగునని చెప్పెను. ఆ మాటలు విన్న చిన్నరాణి గర్వము చే మండిపడుచూ, ఆ స్త్రీని అనరాని కఠిన వాక్కులతో దూషించెను. తదియ గౌరీ అనుభవిస్తావని కదలిపోయెను.

అచట నుండి రాజుగారి పెదభార్య సువర్ణాదేవి కడకు చేరెను. అమ్మా బ్రాహ్మణురాలను వచ్చాను. అని తెలిపెను. ఏ ముత్తైదువు వస్తుందా ! అని ఎదురుచూస్తూన్నాను, నాభాగ్యదేవత వచ్చావా ? తల్లీ ధన్యురాలను. అని కుడిచేతిని పట్టుకొని తీసుకెళ్లి అసహ్యపడక నలుగు పెట్టి నీళ్లూ పోసి తను కట్టే చీరను ఆమెకిచ్చెను. శ్రీషోడశ గౌరీదేవిని నోమించుకొనెను.

రాజుగారునిత్యం పంపే ఆహారం కాస్త ఎక్కువగా పంపమని దాసితో తెలిపింది.

ఇంతకన్నా ఎక్కువ ఏమిలేదని రాజుగారు దివాణం నుండి అధికంగా సామగ్రిని పంపెను. గౌరిదేవి ప్రభావంతో పంచబక్ష పరమాన్నముల పిండి వంటలకు, కూర కాయ సరిపడు వస్తుసామగ్రిని దాసీ మనిషి గంప నిండుగా తెచ్చెను. దయతో మహా రాజు పంచాడని సామగ్రిని చూచి సంతోషంతో అన్ని రకాల వంటకాలు చేసి, నోము నోచి దండ కట్టించుకొని వాయనము నిచ్చి భోజనము పెట్టి తాంబూలదక్షిణ నిచ్చెను. తర్వాత దొడ్డికి వెళ్ళాలి అని అడిగెను. మా ఇంటికి వచ్చిన తల్లివి, మాదొడ్లోనే కూర్చొమనెను. ఆ దొడ్డిలో కూర్చొని మాయమయ్యెను. ఎంత సేపటికి ఆ స్త్రీ రాకపోగా వెళ్ళి చూచెను. ముత్తైదువు లేదు. ధనరాశి కుప్పగా కనిపించెను. శ్రీషోడశ స్వర్ణగౌరీ దేవియె తన ఇంటికి వచ్చెనని సంబరపడుచుండెను.

ఇంతలో చిన్నరాణి సౌభాగ్యదేవికి మతిచెలించి పిచ్చి దానిలా తలవిప్పుకొని, గుడ్డలు చించుకొని కేకలు వేస్తూ తిట్టుచూ నానా గొడవ చేయసాగెను. విసిగి పోయిన రాజు గారు ఇంట్లో నుండి తరిమివేసెను.

సవతి సువర్ణాదేవి వద్దకు వచ్చి అక్కా ఒక బ్రాహ్మణ ముత్తైదువును దూషించి వెళ్ల గొడితిని. దాని ఫలితము నామతి చలించినది. రాజుగారు తరిమివేశాడు . దిక్కుతోచక నీ వద్ద చేరాను. అక్కా అని దుఃఖపడెను. ఓదార్పుతో ఆమెయే శ్రీషోడశ గౌరిదేవి విషయమంతా తెలిపెను.

ఆ మాట విన్న సౌభాగ్యదేవి అగౌరీదేవి నాకెంతవరకు దర్శన మవదో అంతవర్యంతం నిద్రఆహారాలు నాక్కరలేదని శపథము చేసి అరణ్యంలో నడవ సాగెను. కనిపించే చెట్టుపుట్టను అడుగుచుండెను.

దారిలో ఒక మామిడి వృక్షమును చూచి ఓ వృక్షములలో గొప్పదానా నీవు షోడశగౌరిని చూచితివా అని అడిగినది కాని ఆ చెట్టు ఎవరో నేను చూడలేదని పలికినది. నాగతి ఏమిటో తెల్పుకోమని చెప్పినది.

అటునుండి నడవగా కొండ చిలువ (పెద్దపామును) చూచెను. దానిని కూడా అడిగెను కాని చూడలేదని ప్రత్యుత్తర మిచ్చినది, నాకర్మ తెల్పుకోమంది.

మరి కొంత దూరం వెళ్లగా అచట రెండు కొలనులు కనిపించగా వాటిని చూచి మీరు తదియగౌరిని చూచితిరా అని అడిగినది. అవి మేము చూడలేదని, తమ బాధ వెల్లబుచ్చినవి.

ఇంకాకొంతదూరం నడవగా నిలువెత్తు గడ్డిలో ఒక ఆవు గాడిద తిరుగాడుచు కంటపడెను. తమరైనా శోడశగౌరిని చూచితిరా అని అడిగెను. చూడలేదని మాగతి తెల్పుకోమనెను.

నడక సాగించగా ఆకాశంలో వ్రేలాడు చున్న రెండు రోకళ్లను చూచి మీరు తదియ గౌరిదేవిని చూచారా అని అడిగెను. మేము చూడలేదు మా అవస్థ తెల్సుకోమని పలికినవి.

మరికొంత దూరం వెళ్లగా పొయ్యిపైన కాలుచున్న రొట్టెపెనుమును చూచి నీవైనా షోడశ గౌరిని చూచి నావా అని అడిగెను చూడలేదు? నా గతి తెల్సుకోమని వేడుకున్నది.

నడవఓపిక లేక ఉత్తరేణి వనంలో పడి మూర్చబోయెను. తదియగౌరిదేవి అనుగ్రహముంతో సౌభాగ్యదేవిని మేల్కొల్పి బ్రాహ్మణ ముత్తైదువుగా దర్శనమిచ్చి అమ్మా అదృష్టవంతురాలవు నేను శ్రీషోడశ గౌరీదేవిని. చూపెదనంటూ తీసుకెళ్లి తనకు తానుగా పదహారు కళలతో స్వర్ణగౌరీగా శ్రీ షోడశగౌరీగా ప్రత్యక్షమయ్యెను. అమ్మవారి దర్శన భాగ్యముతో పునీతురాలై అచ్చటనే ఆకులు పూలచే భక్తితో పూజించెను. దయతో శ్రీషోడశ గౌరీదేవి అనేక వరముల కోరమనెను. దేవతా భక్తి పతిభక్తి కలిగి, సవితి పోరు లేకుండునట్లు పుత్ర పౌత్ర ధనసంపదలతో సుఖించునట్లు కోరెను.

తర్వాత అమ్మాదారిలో మామిడి వృక్షము ఏది
కొండచిలువ ఏది కొలనులు ఏవి ఆవు, గాడిద ఏది
రోకళ్లు ఎవరు కాలుచున్న పెనుము ఏది బ్రాహ్మణ ముత్తైదువు ఎవరు వారి
యొక్క పూర్వ కథ తెలుపుమని వేడుకొనెను.

1. అరణ్యంలో మామిడి చెట్టుగా కనిపించినవాడు ఒక పండితుడు బాగా విద్యను అభ్యసించి ఎవరికిగాని విద్య చెప్పక గర్వించి యుండెను. అతడే మామిడి వృక్షముగా పుట్టినాడు.

2. కొండచిలువగా కనిపించిన పెద్దపాము ఒక దనికుడు ఎంతో ధనమునిలువ చేసి తను అను భవించలేదు. ఇతరులకు దానధర్మము గావించలేదు. ఆపిసనారి (లోభి) యే కొండచిలువగా జన్మించి ధనరాశిపై పడియుండెను.

3. సరోవరాలుగా కన్పించిన కొలనులు రెండునూ. ధర్మా అధర్మాలు ఒక ఇంట్లో తోడికోడళ్లు యారాళ్లు నోము నోచుకొని ఇతరులకు వాయనము ఇచ్చిన పోవునని అనుకుని ఇంట్లోది ఇంట్లోనె వాయనము ఇచ్చిరి. దానివల్ల కొలనులుగా జన్మించిరి.

4. ఆవు, గాడిద గా కనిపించిన వారు రాజు, మంత్రి ఊసర క్షేత్రం చవిటి భూమిని బ్రాహ్మణునికి దానము చేసిన వాడు రాజు ఆవుగా బుట్టినాడు. సలహా ఇచ్చిన వాడు గాడిదగా జన్మించాడు.

5. రెండు రోకళ్లుగా చూచిన వారు ఇద్దరు ముత్తైదువులే కావలసినన్నీ దంపుకొని ఆ రోకళ్లను పడుకోబెట్టి బొట్టుపెట్టి నమస్కరించక, గోడకు నిలబెట్టిరి గాన వారు రోకళ్లుగా బుట్టిరి.

6. పొయ్యిపై కాలుచున్న రొట్టె (పెంక) పెనుము. ఒక ఆవిడ తనకు కావలసినన్ని రొట్టెలు కాల్చుకొని, పెనమును పొయ్యిపై వదలిపెట్టెను. ఆమె మరు జన్మలో రొట్టె పెంక, పెనుముగా పుట్టినది.

7. బ్రాహ్మణ ముత్తైదువుగా కనిపించిన దానిని నేనె అని చెప్పి సౌభాగ్యదేవిని దీవించెను. అక్షంతలు ఇచ్చి వారిపై చల్లిన శాపవిముక్తు లౌదురని దేవి అంతర్ధాన మయ్యెను.

తిరుగు ప్రయాణంలో శాపగ్రస్థులను అక్షలతో విముక్తి చేసెను. సవితి అక్కతో జరిగిన వృత్తాంతము చెప్పెను. ఈ శుభ సమాచారము ప్రద్యుమ్న మహారాజు గారికి తెలిపిరి. పల్లకిని పంపి ఇద్దరు రాణులను అన్యోన్య సఖ్యతతో రాజ భోగాలననుభవించారు. ఇవి స్కాంద పూరాణంలోనిది సంపూర్ణం.

అత్త దండన కలిగి, మామ దండన కల్గి పుత్ర దండన కల్గి పౌత్ర దండన కల్గి, స్వర్గానికి పోయిన సవతి పోరు వద్దు. మోక్షానికి పోయినా మగనిపోరు కావాలి. అని బ్రాహ్మణుని చేత దండ, తోరము కట్టించునపుడు. యింటి ఇల్లాలుచే అనిపించ వలెను.

ఉప్పు బియ్యము గాని, పప్పు బియ్యము కాని చేతితో మూడు గుప్పెళ్లు పట్టించి దండవేయించుకోవలెనని పెద్దలు చెబుతారు.

ఇతర ముత్తైదువులకు వాయనాలు, తాంబూలాలు ఇచ్చి అక్షంతలు వేయించుకోవలెను. విధానము తప్పినా. క్రమముతో భక్తివీడరాదు.

శ్రీషోడశగౌరీ దేవి, స్వర్ణ గౌరీ, తదియ గౌరీ అన్నీయూ ఆమేయె సౌభాగ్య సిద్ధిరస్తు -

సంపూర్ణము



నారచనలు :

1. రమాసహిత సత్యనారాయణ వ్రత కథ.
2. శ్రీసత్యనారాయణ వ్రత కల్పమ్. ధర్మార్థకామమోక్ష మహాత్మ్యమ్. కేదారేశ్వర వ్రతము.
3. శ్రీషోడశ గౌరీ, తదియనోము కథ, స్వర్ణగౌరీపూజ.

జగన్మాత సంఘమువారికి, నూతనంగా రచించిన, ఈ షోడషగౌరీ తదియనోము కథ స్వర్ణగౌరీపూజను. ప్రతిమాసంలో సభ్యుల గృహమున శ్రీలలితాదేవీ చతుషష్ఠి పూజా కార్యక్రమాలు 8 సం॥ రములు గడచిన సందర్భమున అంకితము.

శ్రీ వైదిక హరిహర సంఘము వారికిని నమోవాకములు,

శాశ్వత సభ్యుడు రాళ్లబండి పాండురంగశర్మ

క్షీరసాగరము. 14-1-1998